పండిత శ్రీ రామశర్మ ఆచార్య మాతా భగవతీ దేవిగార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

(యుగస్పజేతల సింహనాదం)

సంపుటి : 4 మార్చి 99 సంచిక : 9



భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని అధిష్ఠించి తీరుతుంది.




ఆత్మీయ సోదర, సోదరీమణులారా .... వసంతనవరాత్రులు 18-3-99 ఉగాదినుండి 25-3-99 శ్రీరామనవమివరకు జరుపుటకు నిర్ణయించి గురుదేవులు శ్రీ R.K. గారు నిరంతర గురుసాన్నిధ్య అనుభూతి సాధనాశిబిరము ప్రథమవార్షికోత్సవం కూడా అందులో భాగముగానే గ్రాండ్ గా జరుపుతున్నారు. కావున మహాకాలుని పిలుపునందుకొని స్పందించే ప్రతీవ్యక్తీ కదలి రండి గుంటూరు వేణుగోపాలనగర్ కాలనీలో జరుపబడుతున్న ఈ కార్యక్రమానికి. అలాగే "క్లీంబీజసాధన"కు కూడా తరలిరండి. $3\frac{1}{2}$ గంటల సాధన తీసుకొని మీయింటి వద్ద ఆసాధనలు చేసుకోవచ్చును. వివరాలు ఈ పుస్తకమునందే ఇచ్చాము గమనించండి R.K. గారు వేదాలను బయటకు తీసుకురాదలచిన విషయం మీరెరిగినదే. ఆ వేదాంతములైన ఉపనిషత్తులను పాఠకులకు పరిచయం చేయటకై ప్రతి నెలాయిస్తున్నాము గమనించగలరు. చదివి అవగాహన చేసుకోగలందులకు ప్రార్ధన.

ఇట్లు
మీ ఎడిటర్

జై మహాకాల్ - జై జై మహాకాల్

**యుగసంధి కాలపు అంతిమ దిన**

**కౌంట్ డౌన్ 291 రోజులు**

(మార్చి 15వ తేదికి)

# R. K. Letter



50, సుకృతావిల్లా,
వేణుగోపాలనగర్
తేది : 12-3-99
సమయం : 5-40 P.M.

ప్రియ మిత్రులకు,

సంభోధనలో మార్పు గమనించుకోండి. ఒకప్పుడు ఒక విశేషమైన యుగసైనికులుగా బాధ్యతను పూర్తిగా మన మీదే వేసుకొని నవయుగ నిర్మాణము కొరకు గురువుల, మానవేతర ప్రాణుల సహాయము కోరనక్కర లేదని చాలా తీవ్రముగా ప్రయత్నించాను. కాని పరిస్థితులు మానవేతర ప్రాణుల సహాయము తీసుకోక తప్పదని నిరూపిస్తున్నాయి.

గురువులు ఎప్పుడూ అవకాశము యిస్తునే ఉంటారు. 27 మందికి తగ్గకుండా ఒక సమూహముగా ఏర్పడి వారిలో ప్రతి ఒక్కరూ రోజుకు రు.5/-లు, నాలుగు గంటల సమయము యిస్తూ చెప్పిన పని చెప్పినంతే చేస్తూ, లక్ష్య సాధన మాత్రము చెప్పిన దాని కంటె ఎక్కువ సాధింగచలిగే ప్రేమమయ సమూహాన్ని ఏర్పరచ గలిగితే ప్రతీ అమావాస్య, పౌర్ణమికి ఆ 5/-లను నా వద్దకు, సుకృతా విల్లాకు, తీసుకొని వస్తే ఆ సమూహపు కాలన్ని, ధనాన్ని ఎలా ఉపయోగించుకోవాలో నేను సలహాలు ఇవ్వగలను. ఈ Paragraph

(పారాగ్రాఫ్‌ను) మళ్ళా చదువుకోండి. VIBGYOR VEDIC TRUST, GUNTUR పూర్తిగా నా బాధ్యత. నాతో కలసి పని చేయాలనుకొనేవారు రోజుకు రు. 5/-లు, 4 గం॥ల కాలాన్ని నేను చెప్పినట్లు ఉపయోగించుకోవలసి ఉంటుంది. ప్రతీ నెల అమావాస్య, పౌర్ణమికి 15×5=రూ. 75-00లు, 15×4=60 గం॥ల కాలము నాకు సమర్పించవలసి ఉంటుంది. వరుసగా రెండు పక్షములు అనగా అమావాస్య, పౌర్ణమిలు Miss అయితే, మరి, మీరు నాతో ఏ విధమైన సంబంధము పెట్టుకోనక్కర లేదు. ఒక విధంగా ఇటువంటి వారు అందరూ నా అంశములే. నా ఆధ్యాత్మిక శరీరములోని భాగములే. అంచేత వారే నేను. నేనే వారు. నాకు వారికి అభేదము.

మిత్రులని సంభోదించబడిన మీరు ఈ స్థాయికి ఉండనక్కర లేదు. మీకు తోచినప్పుడు పరిస్థితులు అనుకూలించి నప్పుడు, ఇంకా మీరు స్వయముగా పెట్టుకునే అవరోధాల నుంచి ముక్తి చెందుంచుకొన గలిగితే మన యొక్క అనేక ట్రస్టులలో మీ సమయాన్ని, ధనాన్ని వెచ్చించి చాలా గొప్ప కార్యకర్తలని పేరు తెచ్చుకోండి.

"ఒక్క అనుగ్రహ నగర్‌కు తప్ప ఇతర ట్రస్టులు ఏ విధమైన ఆర్థిక, లేక ఇతర ప్రణాళిక కార్యక్రమాలలో తీసుకునేవి స్వయం నిర్ణయాలే. మారెళ్ళ శ్రీరామకృష్ణ అను పేరు గల శ్రీ కామరాజు పుత్రుడినైన నాకు ఎటువంటి సంబంధము లేదు. సలహాలు ఏటు వంటి కార్యాలు చేయాలి అనే అనుమానాలు ఈ సంవత్సర కాలములో ట్రస్టు కన్వీనర్‌లకుగాని, ట్రస్టీలకు గాని రాలేదు. అందువల్ల అదే ఆదర్శాన్ని ఇంకనూ కొనసాగిస్తూ ఆ మహాకాలుని పర్యవేక్షణలో మీదైన రీతిలో జీవిస్తారని ఆశిస్తూ గురుసత్తా మరియు మహాకాలుని యొక్క ప్రేరణ మీకు లభించాలని దానిని మీరు గమనించి తదనుగుణ్యంగా

ఆచరిస్తారని ఆశిస్తూ

మీ మిత్రుడు

P.S. : చెప్పింది చెప్పినా అర్థం అవకపోవటం మన సుగుణాలలో ఒకటి. కనుక మళ్ళీ చెప్తున్నాను. **VIBGYOR VEDIC TRUST మరియు అనుగ్రహనగర్ నిర్మాణాము మాత్రమే సంపూర్ణముగా నా పర్యవేక్షణలో ఉన్నది.** వీటి యొక్క ఆర్థిక, ఇతర వనరుల సమీకరణ నా బాధ్యత కాదు. పని చేసె తీరు మాత్రమే నా సలహాల మేరకు జరుగుతుంది.

మిగతా ట్రస్టుల యొక్క కార్యక్రమాలుగాని లేక ఇతరులు ఎవరైనా నా సలహాను నాకు అనుకూలముగా ఉన్న సమయములో కోరవచ్చు. సలహా అడిగిన మీరు తక్షణమే దానిని పాటించారా లేదా అన్నది. నేను పట్టించుకోను. మీరు సలహాలు అడిగినా మీరు నిశ్చింతగా ఉండవచ్చు. అడగటం మానవద్దు.కనీసం ఆ మాత్రము సంబంధము నన్ను మీతో ఉంచుకోనివ్వండి.



# పంచదశీ మహామంత్రము

స్మరో మారో మారః స్మర ఇతి వరో మార మదనః ।
స్మరానంగశ్చేతి స్మరమదన మారాః స్మర ఇతి ॥
త్రిఖండః ఖండాంతే కలిత భువనేశ్యక్షరయుత ।
శ్చతుః పంచార్ణాస్తే త్రయ ఇతిచ పంచాక్షరమనుః॥

గౌడ పాదాచార్యుల వారు ఈ శ్లోకంలో పంచదశీ మహామంత్రాన్ని వివరించారు. ఇది పదిహేను అక్షరాల మంత్రం.

| | | | |
|---|---|---|---|
| 1. | స్మర | - | క కారబీజము |
| 2. | మారో | - | ఏ కారము |
| 3. | మారః | - | ఈ కారము |
| 4. | స్మర | - | ల కారము |
| 5. | పర | - | హ కారము |
| 6. | మార | - | స కారము |
| 7. | మదన | - | క కారము |
| 8,9. | స్మరానంగములు | - | హ, ల కారములు |
| 10. | స్మర మదనము | - | స కారము |
| 11. | మార | - | క కారము |
| 12. | స్మర | - | ల కారము. |

ఈ బీజాక్షరములను మూడు ఖండములుగా చేసి, ఆ ఖండాంతములందు భువనేశ్వరీ బీజము అనగా హృల్లేఖ (హ్రీంకారము) లను చేర్చినట్లైతే పంచదశాక్షరీ మహామంత్రం అవుతుంది.

మంత్రం :- కఏఈల హ్రీం । హసకహల హ్రీం । సకల హ్రీం ।

ఈ మంత్రాన్ని సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులవారు ఈ విధంగా చెప్పారు.

శివ శ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరా మార హరయః
అమీ హృల్లెఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజన్తే వర్ణాస్తే తవ జనని నామావయవతామ్.

శ్రీ విద్యలో ప్రసిద్ధమైనది పంచదశీ మహామంత్రము, ఇది శాక్తేయానికి గాయత్రి వంటిది. గాయత్రి మంత్రం బ్రాహ్మణుల కోసం ఏర్పడగా, పంచదశీ మహామంత్రం చతుర్వర్ణాల వారికి ఉపాశ్య అని అగస్త్య మహర్షి వ్రాసిన శ్రీ విద్యాదీపికలో చెప్పబడింది. పంచదశీ మహామంత్రం మాయను పోగొట్టి పరబ్రహ్మను ప్రకాసింప చేస్తుంది.

మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మధుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, శివుడు, విష్ణువు, దూర్వాసుడు, బలరాముడు, దత్తాత్రేయుడు మొదలైన అనేక మంది ఈ మంత్రం జపించి తరించారు అని మానసోల్లాసము, జ్ఞానార్ణవములలో చెప్పబడింది.

అయితే పంచదశీ మహామంత్రాన్ని దర్శించి ఈ లోకానికి తెచ్చినవాడు మన్మధుడు. అతడే ఈ మంత్రానికి ఋషి అని కొందరి వాదము. కాగా దక్షిణామూర్తి మూల పురుషుడు అని కొందరంటారు.

సంస్కృత భాషకు గల అక్షరాలలో అ నుండి అః వరకు అచ్చులని, క నుంచి క్ష వరకు హల్లులనీ అంటారు. అచ్చులు శక్తి రూపాలు, హల్లులు శివరూపాలు. ఈ విషయాన్ని మాతృకా హృదయం అనే గ్రంధంలో వివరించటం జరిగింది.

అక్షరాలను మొత్తం మూడు భాగాలుగా చేసి అంటే

1. అ నుంచి అః వరకు 16 అక్షరాలు - మొదటి భాగము
2. క నుంచి త వరకు 16 అక్షరాలు - రెండ భాగము
3. ధ నుంచి స వరకు 16 అక్షరాలు - మూడవ భాగము

ఈ రకంగా మూడు భాగాలుగా చేసి వాటిలో సత్వ, రజస్, తమో గుణాల, త్రిమూర్తుల, చంద్ర సూర్యాగ్నుల, జాగ్రత్ స్వప్ప సుషుప్తి అనుబడే మూడు

అవస్థల తత్త్వాలు చేర్చబడ్డాయి. వీటిలో నిత్యలను.కూడా చేర్చటం జరిగింది. నిత్యలు మొత్తం పదహారు. ఈ షోడశనిత్యలను వసిష్ఠ సంహితలో శివుడు పార్వతికి వివరిస్తాడు.

ఈ నిత్యలు వరుసగా

1. కామేశ్వరి
2. భగమాలిని
3. నిత్యక్లిన్న
4. భేరుండ
5. వహ్నివాసిని
6. మహావిద్యేశ్వరి
7. రౌద్రీ (శివదూతి)
8. త్వరిత
9. కులసుందరి
10. నిత్యా
11. నీలపతాక
12. విజయ
13. సర్వ మంగళ
14. జ్వాలామాలిని
15. చిత్ర
16. మహాత్రిపురసుందరి

ఈ షోడశ నిత్యలు శుక్లపక్ష పాడ్యమి మొదలు పౌర్ణమి వరకు తిథులు రూపమున, కృష్ణపక్ష పాడ్యమి మొదలు అమావాస్య వరకు తిథుల రూపమున ఉన్నారు. వీరినే చంద్రకళలు అని అంటారు. చంద్రకళలే పాడ్యమి మొదలైన తిథులని జ్యోతిశాస్త్రంలో చెప్పబడింది. పాడ్యమి నుండి పౌర్ణమి వరకు పదిహేను అమావాస్యలు మొత్తం 16 తిథులు. పదహారవ కళ షోడశిసచ్చిదానంద స్వరూపిణి అయివున్నది. ఇదే సాదాఖ్యకళ. నాదబిందు కళాతీతమయినది. ఈ రకంగా పదహారు తిథులను, పదహారు కళలను

1. ప్రకటయోగిని
2. గుప్తయోగిని
3. గుప్తతరయోగిని
4. సంప్రదాయయోగిని
5. కుళోత్తీర్ణయోగిని
6. నిగర్భయోగిని
7. రహస్యయోగిని
8. అతిరహస్యయోగిని
9. పరాపరరహస్యయోగిని

అనబడే తొమ్మిది మంది యోగినులను అందులో అంతర్భావం చేసి, ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క హ్రీంకారాన్ని ఏర్పాటు చేశాడు. హ్రీంకారము అనేది ప్రాణశక్తి. అదిలేకపోయినట్లైతే మంత్రము నిర్వీర్యమవుతుంది.

షోడశకళ సాదాఖ్యకళలు మూడు ఖండాలుగా చేయబడ్డాయి.

1. శివ, శక్తి, మాయ, శుద్ధవాద్య, జలము అనే 5 తత్వాలకు సంబంధించిన మొదటి ఐదు కళలు గల ప్రథమ ఖండాన్ని అగ్నేయ ఖండం అంటారు. దీనికి అధిదేవత అగ్ని.
2. తేజస్సు, వాయువు, మనస్సు, పృధివి, ఆకాశము అను ఐదు తత్వాలకు సంబంధించిన ఆరు నుంచి పది వరకు గల కళలు సౌర ఖండము. దీనికి అధిదేవత సూర్యుడు.
3. విద్య, మహేశ్వరి, పర, ఆత్మ, సదాశింన అను ఐదు తత్వాలకు సంబంధించిన చివరి ఐదు కళలు సౌమ్య ఖండము. దీనికి అధిదేవత సోముడు.

ఈ రకంగా సోమ, సూర్య అనలాత్మకములైన మూడు ఖండాలుగా ఈ మంత్రం విభజించబడింది. ఈ మూడు ఖండాలను మూడు కూటములు అంటారు.

1. క ఏ ఈల హ్రీం - ఇది వాగ్భవ కూటము విద్యాప్రదా, బుద్ధి ప్రదం.
2. హసకహల హ్రీం - ఇది కామరాజ కూటమి, అభీష్ట సిద్ధి కలిగిస్తుంది. భోగప్రదము.

3. సకల హ్రీం - ఇది శక్తి కూటమి, యోగ ప్రదము.

పంచదశీ మహామంత్రములోని మూడు కకారములు, రెండు హ కారములు శివాత్మకములు. మూడు హ్రీం కారములు శివ శక్త్యాత్మకములు. మిగిలిన అక్షరములు శక్త్యాత్మకములు. ఈ విషయము తెలియకుండా ఎంత కాలము జపం చేసినా మంత్రం సిద్ధించదు.

(మరికొంత వివరణ వచ్చే నెలలో)

# సద్గురూపదేశ మహిమ



సద్గురువుల నిరంతరము శ్రద్ధా భక్తులతో సేవించెడి సశ్చిష్యున క్రింద యమనంబులు వశవర్తులై యుండును. స్వయముగ ఎవరును నేవిద్య నేర్వరాదు. భోధవాదులగు పండితుల వద్ద కూడ బ్రహ్మ విద్య నభ్యసింపరాదు.

పూర్వకాలమున వరుణుని వలన భృగువును, యాజ్ఞవల్క్యుని వలన జనకుడు మొదలగువారును బ్రహ్మ విద్య నభ్యసించిరి. అట్లే శ్రీరాముడు వశిష్ఠుని యొద్దను, శ్రీకృష్ణుడు సాందీపుని యొద్దను బ్రహ్మ విద్య నభ్యసించిరి. ఈ విధముగా నున్నత పదవి ననుష్ఠించిన మహ్మాతులందరును శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠులైన సద్గురువులను సేవించి విద్యనభ్యసించిన వారేయగుదురు. ఇందు జ్ఞాని అనగా శ్రోత్రియుడనియు, తత్త్వదర్శినగా బ్రహ్మనిష్ఠుడనియు అర్థము.

ఈ విషయమే ఒక కథారూపయుగ చెప్పబడినది. పూర్వము బ్రహ్మ విద్యా సంపన్నుడగు నొక మహాత్ముడు దక్షిణ దేశము నందుండెను. ఆయన శిష్యసహితడ దేశాటన చేయుచుండడివారు. తమ్మాశ్రయించిన భక్తులకు బ్రహ్మోపదేశము చేయుచుండెడివారు. ఒకనాడు విజయనగరం వచ్చి విడిది చేసియుండిరి. ప్రతి దినము పలువురు భక్తులు స్వామి వారిని దర్శించి ఉపదేశమును పొందుచుండిరి.

ఆ పట్టణ వెలుపల ఏనాదివారి గుడిసెలున్నవి. అందు సోలిగాడనెడి ఒక ఏనాది వాడుండెను. అతడు జారత్వ, చోరత్వాది సమస్త దుర్గుణములకు ఖని . అతడు స్వాములవారి ప్రభావము విని "సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం" అను నార్యోక్తి ప్రకారం వారిని దర్శించవలెనను సత్సం కల్పము కల్గి, పండ్లు, పుష్పములు మొదలగునవి తీసికొని వెళ్ళి స్వామికి

సమర్పించి సాష్టాంగ దండ ప్రణామము లాచరించి, నాకు పరమార్థము నుపదేసింపుడని వేడుకొనెను.

అతని పూర్వస్వభావము తెలిసిన పట్టణవాసులు వాడు ఉపదేశానర్హుడని చెప్పినప్పటికినీ, తన్నాశ్రయించిన భక్తునకు ఉపదేశము చేయుటకంగీకరించెను.

అజ్ఞానముచేత అనేక దుష్కృత్యములు చేసిన మాట నిజమేనని అంగీకరించి,ఇక దేవరవారి ఆజ్ఞానుసారం వర్తించెదనని చెప్పుచు దొంగతనం మా కులవృత్తి దానిని విడిచిపెట్టిన మాకు వేరు జీవనాధారము లేదని. వేరొక బ్రతుకుదెఱవు మార్గము దొఱకు నంతవరకు తమరు దాని నంగీకరించుచు పరమార్థము బోధింపుడని మరీ మరీ ప్రార్థించెను.

బ్రహ్మోపదేశము పొందుటకు కామక్రోధాది దుర్గుణములను హింసాది ఘాతుక కృత్యములు సంపూర్ణముగ విడువవలయును. ఏ పరిస్థితులలోను అబద్ధమాడరాదు. సత్యమునే పల్కవలెను. జీవనమునకు మరొక వృత్తి దొరకు వరకు పూర్వ వృత్తితోనే జీవించు చుండుమని స్వామి చెప్పెను.

ఆ మాటలకు సోలిగాడానందభరితుడై యింటికి వెళ్ళెను. తరువాత స్వాములవారు ఆ పట్టణమును విడిచి మరి యొక ప్రదేశమునకు వెడలిపోయిరి.

సోలిగాడు స్వామి మాటలను వినయ భయభక్తులతో తూచా పాటించుచుండెను. ఇంట్లో ఆహారపదార్థములు లోపించిన కారణంగా ఒక రాత్రి కన్నపు కత్తి తాళ్ళ నిచ్చెన మొదలగు పరికరములతో దొంగతనము చేయుటకు బయలుదేరెను. ఆపట్టణపు రాజుగారు పట్టణ ప్రజల కష్టసుఖములను గమనించుటకు, స్వయముగా మారు వేషముతో బజారులలో తిరుగాడుచుండెను.

ఆ సమయంలో సోలిగాడు కన్పించగా నీవెవరవని రాజు ప్రశ్నించెను, నేను దొంగనని బదులు చెప్పెను. నీవెవరవని సోలిగాడు వాని నడిగెను. దానికి నేనును దొంగనే అని చెప్పి, మనమిరువురము కలిసి దొంగతనము

సమర్పించి సాష్టాంగ దండ ప్రణామము లాచరించి, నాకు పరమార్థము నుపదేసింపుడని వేడుకొనెను.

అతని పూర్వస్వభావము తెలిసిన పట్టణవాసులు వాడు ఉపదేశానర్హుడని చెప్పినప్పటికినీ, తన్నాశ్రయించిన భక్తునకు ఉపదేశము చేయుటకంగీకరించెను.

అజ్ఞానముచేత అనేక దుష్కృత్యములు చేసిన మాట నిజమేనని అంగీకరించి,ఇక దేవరవారి ఆజ్ఞానుసారం వర్తించెదనని చెప్పుచు దొంగతనం మా కులవృత్తి దానిని విడిచిపెట్టిన మాకు వేరు జీవనాధారము లేదని. వేరొక బ్రతుకుదెఱవు మార్గము దొఱకు నంతవరకు తమరు దాని నంగీకరించుచు పరమార్థము బోధింపుడని మరీ మరీ ప్రార్థించెను.

బ్రహ్మోపదేశము పొందుటకు కామక్రోధాది దుర్గుణములను హింసాది ఘాతుక కృత్యములు సంపూర్ణముగ విడువవలయును. ఏ పరిస్థితులలోను అబద్ధమాడరాదు. సత్యమునే పల్కవలెను. జీవనమునకు మరొక వృత్తి దొరకు వరకు పూర్వ వృత్తితోనే జీవించు చుండుమని స్వామి చెప్పెను.

ఆ మాటలకు సోలిగాడానందభరితుడై యింటికి వెళ్ళెను. తరువాత స్వాములవారు ఆ పట్టణమును విడిచి మరి యొక ప్రదేశమునకు వెడలిపోయిరి.

సోలిగాడు స్వామి మాటలను వినయ భయభక్తులతో తూచా పాటించుచుండెను. ఇంట్లో ఆహారపదార్థములు లోపించిన కారణంగా ఒక రాత్రి కన్నపు కత్తి తాళ్ళ నిచ్చెన మొదలగు పరికరములతో దొంగతనము చేయుటకు బయలుదేరెను. ఆపట్టణపు రాజుగారు పట్టణ ప్రజల కష్టసుఖములను గమనించుటకు, స్వయముగా మారు వేషముతో బజారులలో తిరుగాడుచుండెను.

ఆ సమయంలో సోలిగాడు కన్పించగా నీవెవరవని రాజు ప్రశ్నించెను, నేను దొంగనని బదులు చెప్పెను. నీవెవరవని సోలిగాడు వాని నడిగెను. దానికి నేనును దొంగనే అని చెప్పి, మనమిరువురము కలిసి దొంగతనము

చేయుదమని చెప్పెను. అప్పుడు సోలిగాడు అందుల కంగీకరించి, బీదవారి ఇండ్లలో దొంగతనం చేసిన వారు జీవించుటకు లేక బాధపడెదరు. రాజుగారి మేడకు కన్నము వేయుదమని చెప్పగా రెండువ దొంగయు అందులకంగీరించెను.

కొత్త దొంగను బయట కాపలాయుంచి, తాను తెచ్చిన పరికరముల సహాయముతో రాజాంతఃపురమున ప్రవేసించెను. హంసతూలికా తల్పమున వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్యాదులు పొదిగిన సువర్ణాభరణములను ధరించి పవళించియున్న రాజుగారి భార్యను గాంచెను. ఆమెను చూడగానే ఆ దొంగకు అమితమైన భక్తి ప్రపత్తులు కలిగి, ఆమెకు నమస్కరించి, అ గది నుండి వేరొక గదికి వెళ్ళెను. అచ్చట ధనపుపెట్టెలు రెండుండెను. అచ్చటనే బీరవాలో నొక భరణి కన్పించెను. అందున్న ఐదు రత్నములను తీసికొని బయటికి వెడలిపోయెను. రెండవ దొంగ ఏమి జరిగినదని యడుగగా జరిగినదంతయు యధార్థముగా జెప్పి, తెచ్చినవానిలో రెండురత్నములను వానికిచ్చి మిగిలిన మూడు రత్నములను తీసికొని వెళ్ళిపొయెను.

తెల్లవారిన పిదప దాసదాసీజనులు రాత్రి అంతఃపురమున జరిగిన దొంగతనమును రాజుగారికి విన్నవించిరి. రాజుదానిని గురించి వివరములను తెలుసుకోవలసినదిగా మంత్రిగారిని నియమించెను.

మంత్రి ఆ ప్రదేశమునంతయు పరిశీలించి రత్నములు ఐదు లేకపోవుట ధనపు పెట్టెలు రెండును యధాప్రకారంగా అచ్చటనే యుండుట గమనించెను. ఈ ధనపు పెట్టెలు రెంటిని తన యింటికి తోలించి, అవి కూడ రాత్రి దొంగిలించబడినవని రాజుగారికి తెలిపినచో ఆ ధనము తనకు దక్కునని తలంచెను. అట్టి దుస్సంకల్పము బుద్ధియందు ప్రబలమై ఆ ధనపు పెట్టెలను తన యింటికి తరలించెను. తిరిగి రాజు దగ్గరకు వచ్చి ఐదు రత్నములు, రెండు ధనపు పెట్టెలు దొంగలించబడినవని రాజుగారికి నివేదించెను.

రాజా విషయమును విని ఎవరు దొంగిలించారో విచారింపుమని మంత్రిని నియమించేను. అంత మంత్రి ఊరు వెలుపలనున్న ఏనాది వారిని

పిలిపించి, దొంగతనము ఎవరు చేసినది చెప్పుడని గద్దించి కొట్టబోవుచుండెను. అప్పుడు సోలిగాడు అయ్యా వారు నిరపరాధులు వారిని కొట్టవద్దు, కన్నం వేసినది నేనే. నేను ఐదు రత్నముల నపహరించి నాతో వచ్చిన మరియొక దొంగకు రెండు రత్నములనిచ్చి మూడు రత్నములను నేను తీసుకొంటిని. అవి నా వద్ద నున్నవి అని, చెప్పను. అంతటి మంత్రి సోలిగానితో ధనపు పెట్టెలు రెండు అపహరించితినని చెప్పుటలేదు. నీవు కాక మరెవరు వచ్చిరని కఠినముగా కొరడాతో దండించుచున్న రెండవ దొంగగా నటించిన రాజుగారు కలుగజేసుకొని ఇట్లనెను. వాని మీద పోవునని మరెవరైన దొంగలించి యుండగూడదాయని అందరిని రాజదర్బారులోనే కదలక ఉండుడని కోరెను. అంతట రాజభటులను పిలిపించి అచ్చట నున్న వారి గృహములను పరిశోధింపుడని ఆజ్ఞాపించెను.

వారు వెళ్ళి గృహములను వెదకుచుండగా ఆ ధనపు పెట్టెలు రెండును మంత్రి యింటి వద్ద కానవచ్చెను. ఆ విషయమును రాజుగారికి నివేదించిరి.

అప్పుడు రాజు కోపించి ఓరీ దుర్మార్గుడా నా సొమ్ము ఇన్ని దినముల నుండి తింటూనా యింటినే దోచితివని అతనిని పట్టణము నుండి కట్టుబట్టలతో వెడల గొట్టించెను. అంతట సోలిగాడిని పిలిచి నీవు నిజము చెప్పినావు, కాన వెడలి పోయిన మంత్రి ఆస్తిపాస్తులను స్వాధీనపరుచుకొని మంత్రిగా నుండుము. నిన్ను సోలంరాజు అని పిలిచెదరు. అని రాజు చెప్పెను. దానికి సోలిగాడు నాకు చదువేరాదు నేను ఉండననెను. అందులకు రాజు అంగీకరింపక సత్యవ్రతుడవు మంత్రిగా నుండవలెను. అట్లుండుటచే దేశ ప్రజలు సౌఖ్యవంతులై యుందురని నిశ్చయించి సోలంరాజు అను నామంతో మంత్రిగా నియమించి అతనికి విద్య నేర్పించసాగెను. సోలంరాజు మంత్రిత్వము పరిపాలన చక్కగా జరుగుచుండగా ప్రజలు సౌఖ్యనందములతో తులతూగుచుండిరి.

ఒకనాడు రాజదర్బారు జరుగుచుండగా, పూర్వము తనకుపదేశించిన గురువుగారా గ్రామము వచ్చినానరని మంత్రిగారికి తెలియగా వెంటనే ఎవ్వరికి

చెప్పకుండానే వెళ్ళిపోయి గురువుగారిని దర్శించి ఫలపుష్పాదులను సమర్పించి సాష్టాంగ నమస్కారమొనర్చి నేను శరీరము నమ్ముకొంటిని మరలవచ్చి దర్శనము చేసికొందునని వెడలిపోయెను. ఈ విషయమంతయు రాజు గారు గ్రహించి తాము కూడ ఆ మహానియుని దర్శించ వలెనని బయలుదేరిరి వారి వెంట పెద్దలందరు బయలుదేరిరి. ఫలపుష్పదులను స్వామికర్పించి సాష్టాంగదండ ప్రణామములాచరించి బ్రహ్మోపదేశమును పొంది తరించిరి.

ఒక గ్రామములో ఒక నిజమైన గురుభక్తుడున్నచో అందరు తరించుటకతడు మార్గ దర్శకుడగును. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువునకు చతుర్విధ శుశ్రూషలొనర్చి వారు ప్రసన్నులైన పిదప సాష్టాంగ నమస్కారమాచరించి వినయ పూర్వకంగా పరమార్థ విషయముల ప్రశ్నించి తెలిసికొని ఆత్మాజ్ఞానము పొంద వలెనని భగవద్గీత యందు కూడా చెప్పబడినది

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః (భ॥గీ॥ 4-34)

అట్లుగాక శాస్త్రాధ్యయనముచే ఆత్మతత్త్వమునెఱింగి ఆత్మానుభవము లేని పండితుల స్థితిని ఉపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది.

శ్లో॥ అనుభూతిం వినామూఢో వృథా బ్రహ్మణి మోదతే ।
ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్ ॥

భావము : అనుభవము లేని మూఢుడు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యాయను మాటలను మాత్రము పలుకుచు సంతసించుట, నీటిలో ప్రతి ఫలించిన కొమ్మ మీద నున్న పండ్లను రుచి చూచి సంతసించునట్లు వ్యర్థమే అనుభవములేని శుష్కవచనముల సఫలములు కావు.

సద్గురుమహిమ నెరుగుటకు ఈ కథ ఎంతయో ప్రయోజన వంతమగును. కథాసారము గ్రహించి సద్గురు భక్తులందరు ఫలము నొందరు గాక.

# విశ్వాత్మ సూర్య ధ్యానము



ఆ సవితా శక్తి వర్షము - అమృత వర్షము, అంతరిక్షము నుండి మన మీద పడుతోంది. బ్రహ్మ.రంధ్రము నుండి మీరు స్వీకరిస్తున్నారు. దాన్ని ఆ జల్లు పడనివ్వండి. బంగారు రంగు జల్లు, బంగారు రంగు కిరణాలు ఈ అమృత వర్షంతో మనలో వున్న ఆత్మశక్తి వికసితమై, పులకితమై, ఉల్లాసవంతమౌతోంది. ఆ ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని Feel అవ్వండి. ధ్యానం చేసి వచ్చిన తరువాత మత్తుగా వుంటున్నాం. కాదు, ఉల్లాసంగా వుండాలి. మనిషి చాలా Active గా వుండాలి. సూర్యడు చూడండి ఎంత Activeగా వుంటాడో. సర్వవ్యాప్తమైన ఆత్మ యందు సమర్ధత, శక్తి జాగరూకత, సరసత - మెల్లగా సాధకుడు ఇక్కొకొక High Jump చేయాలి. సాధనాత్మకమైనటు వంటి High Jump, మిమ్మల్ని మీరు ఆ సూర్యుడిలో కలిపేసుకోండి. సాధకుని యొక్క సవిత యందు సమర్పణ - విసర్జన - విలయము - సమన్వయము - సమాపన - శరణాగతి. మొత్తం మిమ్ముల్ని మీరు ఆ సూర్యునిలో కలిపేసుకోండి. ఏ విధంగా అవుతే నిప్పుతో కలిసిన ఇనుము నిప్పుగా మారిపోతుందో, సూర్యుడితో కలిసిన సాధకుడు సూర్యుడిలా మారిపోతాడు. ఆ సవితాశక్తి ఆత్మ శక్తి యందు ప్రవేశం. భావ చేతన యందు తీక్షణత యొక్క అనుభూతి. మన ఆలోచనా సరళి, మన సంకల్ప సరళి, మనం జీవించే సరళి, ఇది మొత్తము కూడా ఆ సూర్యుడి యొక్క ప్రచండ తీక్షణ, సువర్ణ కిరణాలలో మారిపోతుంది. స్థూల శరీరమందు ఈ సవితా శక్తి

ఓజస్సుగా, సూక్ష్మ శరీరమందు తేజస్సుగా, కారణ శరీర మందు వర్చస్సుగా మారుతోంది. పవిత్రత - ప్రసన్నత - విశిష్టత యొక్క దివ్య అనుభూతి. ప్రకాశ పుంజము వైపునకు అనవరత అనుగమనము. అణచి పెట్టలేనిఉల్లాసముల అనుభూతి. కళ్ళు మూసుకొని అలాగే వుండి మనస్సును నాభి చక్రము వైపుకి తీసుకురండి బంగారు రంగు కిరణాలు నాభి చక్రమును ప్రవేశము. ఆ ఊపు. ఆ లోపలికి వెడుతున్నపుడు నాభి చక్రములో జరిగెటటు వంటి ఊపును గమనించండి. స్థూల శరీరములో మార్పు. ఆ ప్రచండ మైనటువంటి ఓజశ్శక్తి, స్థూల శరీరంలోకి వెళ్ళటం లేదది. ఆ ఊహ తీసుకురండి. ఈ నాభిచక్రములో ప్రవేశించినటు వంటి కిరణాలే మెల్లగా వెన్నుపూస నుంచి పైకి లేచి హృదయస్థానంలో ప్రవేశిస్తున్నాయి. సూక్ష్మ శరీర జాగరణ చేస్తుందన్న భావన. ఇంకా తీవ్రమైనటువంటి భావన చేయండి. ఆ Picture చాలా స్పష్టంగా వుండాలి. అప్పుడే ధ్యానాల యొక్క లాభం. విని వూరుకుంటే శబ్దం మాత్రమే. భావం కలిపితే Bullet లాగా పని చేస్తుందది. నాభి చక్రము నుంచి బంగారు రంగు సూర్య కిరణాలు ఓజస్సుగా మారి అక్కడి నుంచి పైకి వెన్నుపూస ద్వారా హృదయ చక్రములో ప్రవేశము, తద్వారా సూక్ష్మ శరీర జాగరణ. సూక్ష్మశరీరమంటే మన ఆలోచనలు, సూర్యుడి లాంటి ఆలోచనలు. సూర్యుడి యొక్క ఆలోచనలే మన ఆలోచనలు. ఇంక సాధకుడి ఆలోచనేం వుండదు. High Voltage తో సంపర్కము ఏర్పడినప్పుడు High High Potential సంపర్కం కలిగినప్పుడు Low Potential చేయగలిగేదేం లేదు. దానికి Surrender అయిపోటమే. మన ఆలోచలన్నీ కూడా ఆ సవితా శక్తి, ధ్యానసారము అదే మార్చుకుంటుంది. మీరు చూస్తూ వుండండి అంతే, ఆ సూక్ష్మ శరీరాన్ని ఎలా మారుస్తోందో ? అది హృదయము వద్ద.

ఈ రకరకాలైనటు వంటి శక్తులను అది ఏ Combinationలో ఆకర్షించుకుంటుంది ? కొబ్బరి చెట్టవుతే, అది ఆకర్షించుకునే Combina-

tion వేరు. అదే నిమ్మ చెట్టవుతే ఆది ఆకర్షించుకునే Combination వేరు. ఇలాగ ఖనీజ జగత్తులోంచి ఎవల్యూషనరీ సైకిల్‌లో వృక్ష జగత్తులో కొచ్చి - వృక్ష జగత్తులోంచి ఎవల్యూషనరీ సైకిల్‌లో జంతు, జగత్తులో కొచ్చినపుడు మనం ముఖ్యంగా గమనించ వలసినటువంటి మార్పు ఏంటంటే, జగత్తు వరకు కూడా జీవించే విధానం కానీ, జీవించే అలవాట్లు గానీ ఏ విధమైన మార్పు లేకుండా అనాదిగా ఒకేలా వుంటాయి. కానీ, మానవుడు అనేటటువంటి జంతువెప్పుడేతే

> మయూరాసనం వెయ్య గలిగామంటే సమతా స్థితిలోకి వచ్చేసినట్టే. మనం అందుకే మయూరాసనం రెండు విచిత్రమైన శక్తులకి వాహనంగా పని చేస్తుంది. ఒకటి కార్తికేయుడికి - ఒకటి సరస్వతికి.

ఏర్పడతాడో, వాడిలో ఓ తమాషా అయినటువంటి Situation Develop అవుతుంది. అందులో ముఖ్యంగా IV Round లో వున్నామని చెప్తారు మనకి భవిష్యద్దర్శకులు అంటే, ప్రతీ Planetary Cycle కూడా 7 చక్రాలు తిరుగుతుందీ అనీ, అందులో ప్రస్తుతం మనకు 3 1/2 చక్రాలు పూర్తి చేసి నాలుగో Round పూర్తి చేయటంలో వున్నామని, నాలుగో Round ఏంటీ అంటే "సమతాస్థితి" , Balancing State అంటే, అటు మంచి వేపూ వెళ్ళచ్చు - ఇటు చెడు వైపూ వెళ్ళచ్చు. ఆ స్థితిలో వున్నాం మనం. అంటే జ్యోతి శ్శాస్త్రం ప్రకారం మనం చెప్పుకోవాలంటే తులారాశిలో వున్నాం. మన ఆసనాల భాషలో చెప్పుకోవాలంటే మయూరాసనం వేయుచ్చా ? వేయగలమా ? లేదా అనే స్థితిలో వున్నామన్నమాట. వెనకాతల బరువెక్కువైతే కుదరదు. మయూరాసనం అది. మయూరాసనం వెయ్యగలిగామంటే సమతా స్థితిలోకి వచ్చేసినట్టే. మనం అందుకే మయూరాసనం రెండు విచిత్రమైన శక్తులకి వాహనంగా పని చేస్తుంది. ఒకటి కార్తికేయుడికి - ఒకటి సరస్వతికి. ఈ రెండూ రెండు

విచిత్రమైనటువంటి శక్తులు ప్రపంచంలో అవి మనం తరువాత తెలుసుకుందాం. దేవతా శక్తుల గురించి మాట్లాడుతున్నపుడు, ఇక్కడ మానవ శరీర నిర్మాణంలో జరిగినటువంటి అద్భుతమైనటువంటి విషయమేంటంటే "అష్టవసువు"లున్నారు. ప్రకృతిలో, "అష్ట వసువు లంటే అర్థమేంటంటే ? భూమి రాపోనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ" పృధ్వితత్వము, జలతత్వము, అగ్నితత్వము, వాయుతత్వము, ఆకాశతత్వము, వీటి కంటే సూక్ష్మమైనటువంటి మనస్సు, మనస్సు కంటే సూక్ష్మమైనటువంటి బుద్ధి, వీటిన్నంటినీ Control చేస్తున్నటువంటి ఎనిమిదవ దైనటువంటి ప్రజ్ఞ. ఇవే (8) అష్ట వసువులు. స్థూల జగత్తులో పని చేసేటువంటి అష్టవసువుల్ని, మనిషి సూక్ష్మ జగత్తులో ఆ అష్టవసువుల్నే వుపయోగించుకుంటూ, ఈ వైజ్ఞానిక వరమైనటు వంటి Research అంతా చేస్తున్నాడు. వృధ్వీ తత్వాన్నుపయోగించుకుంటూ, జలతత్వాన్నుపయోగించు కుంటూ, అగ్నితత్వాన్ను ఉపయోగించుకోటమే కదా ! ఈనాడున్నటువంటి Civilization మనం జాగ్రత్తగ చూస్తే, దేన్నుపయోగించుకుంటున్నాం ? Industries లో కానీ, అక్కడ కానీ, ప్రతీ చోటా కూడా అగ్నినే ఉపయోగించుకుంటున్నాం. సాధకుడేం చేస్తున్నాడు ? వాయువునుపయోగించుకుంటున్నాడు.



# ధ్యానము

ప్రకృతికి బానిసలుగా ఉండు తత్వమును ప్రతిఘటించుటకు దోహదము చేయు శక్తియే ధ్యానము. ప్రకృతి మనల్ని పిలువవచ్చు. " చూడూ! ఇది చాలా సుందరమైనది!" నేను చూడలేదు అప్పుడది చెప్పుతుంది. "అచట తన చక్కటి వాసన యున్నది. దీన్ని ఆస్వాదించు" నేను నాముక్కుకు" ఆవాసన చూడకు" అని చెప్పుతాను. అది ఆ విధంగానే చేస్తుంది. నేత్రాలూ! చూడకండి అని చెప్పుతాను. కాని ప్రకృతి ఎంత భయకరమైనదంటే అది నాబిడ్డలలో ఒకరిని చంపి-"మూర్ఖుడా ! ఇప్పుడు కూర్చుని విలపించు అంతులేని విషాదములో మునిగి పో "అంటుంది" నేను



ఆవిధంగా చేయను" అంటాను. నేను అచట నుంచి దూకేస్తాను. నేను స్వతంత్రుడుగా యుండాలి. ఈ విధంగా ప్రయత్నించండి. ధ్యానంలో కొద్ది క్షణాలు ఈ స్వభావమును మార్చుకొనవచ్చును. ఆశక్తి నీలోనే వుంటే అదే స్వర్గము కాదా ? మొక్షము కాదా? అదే ధ్యానము యొక్క అనంతశక్తి.

అది ఏవిధంగా పొందవచ్చును? విభిన్నమార్గాల ద్వారా పొంద వచ్చును. ప్రతి మనస్తత్వనికి సరిపడే మార్గము దానికి వేరుగా యుంటుంది. కాని "మనస్సును స్వాధీనములో ఉంచుకో " అన్నది. సాధారణ సిద్ధాంతము మనస్సు ఒక సరస్సు వంటిది. దానిలో వేసే ప్రతి రాయీతరంగాలను లేపుతుంది. ఈతరంగాలు మనమేమిటో మనల్ని చూడనివ్వవు. పూర్ణచంద్రబింబం సరస్సులోని నీళ్ళలో ప్రతిబింపబడుతుంది. కాని నీటిపై పొర సరిగ్గాలేనందున ఆ ప్రతిబింబము స్పష్టంగా అగుపించదు. ప్రకృతి ఆతరంగాలను లేవనీయకుండా ప్రశాంతముగా ఉంచినట్లయితే కొంత కాలానికి మనమేమిటో మనకు తెలుస్తుంది. భగవంతుడు ఇంతకు ముందే అచట ఉన్నాడు. కాని మనస్సు అల్లికల్లోలముగా యుండి ఎల్లప్పుడు ఇంద్రియములు వెంట పరిగెడుతున్నది. ఇంద్రియ విషయాన్ని మూసివేసినా

అటూ ఇటూ వేగంగా తిరుగుతూనే యుంటావు, ఈ క్షణంలో నేను బాగానే యున్నాననుకొని దైవంపై ధ్యానం చేస్తాను. హఠాత్తుగా మరొక నిముషంలో నా మనస్సు లండనుకు వెళ్లుతుంది. అచట నుండి దాన్ని ఇవతలకు లాగితే నేను న్యూయార్కులో ఇదివరకు చేసిన పనుల గురించి ఆలోచించటానికి అచటకు వెళ్లుతుంది. ఈ అలలను ధ్యానశక్తి ద్వారా నిరొధించాలి.

## ఆనందానికి మార్గము :-

అనంత ఆనందాన్ని మనకు ప్రసాదించే మార్గము ధ్యానం. ప్రార్థనలు, కర్మకలాపముల ఇతర విధములైన పూజలు యివ్వన్నీ ధ్యానము యొక్క ప్రాథమిక స్థితులు మాత్రమే ! ప్రార్థన చేస్తూ ఏదో ఒకటి నివేదన చేస్తావు. ఒక సిద్ధాంతము ప్రకారము ప్రతి ఒకటి ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేస్తుంది. కొన్ని పదముల, పుష్పముల చే దీపారాధనలు ఇత్యాదులు ఆధ్యాత్మిక దృక్పథమునకు మనస్సును చేరుస్తాయి. కానీ ఆ దృక్పథము మరెచ్చటా లేదు. మానవుని ఆత్మాలోనే యున్నది, మనుష్యులంతా ఇది చేస్తూనే యున్నారు. కానీ వారు తెలియకుండా దేనిని చేస్తున్నారో. దానినే తెలుసుకొని చేస్తారు. ఆదే ధ్యానము యొక్క శక్తి.

నెమ్మదిగా క్రమక్రమంగా మనకి మనం తర్ఫీదు ఇచ్చుకోవాలి. అది ఛలోక్తికాదు. ఒక రోజుతో అయ్యే పనికాదు. కొన్ని సంవత్సరాలు లేక కొన్ని జన్మలు పట్టవచ్చు ఫర్వాలేదు. ఈ గుంజులాట సాగిపోవలసిందే. పూర్తిగా తెలుసు కాని తనంతటే తానుగా ఈ గుంజులాట కొనసాగవలసిందే. కొద్ది కొద్దిగా మనం గ్రహించగలుగుతాము. మనం అనుభూతి చెందటం ప్రారంభించి నిజమైన వస్తువుల్ని పొందగలగుతాము, వాటిని మన నుంచి ఎవరూ తీసుకొని వెళ్లలేరు. నాశనం చేయలేరు. అంతేకాదు ఆ ఆనందాన్ని ఏవిషాదమూ ఎన్నడూ కప్పివేయలేదు.



# ముండకోపనిషత్తు

## ప్రస్తావన

ఈ ఉపనిషత్తులో మొత్తం అరవై నాలుగు మంత్రాలున్నాయి. ఇవి మూడు భాగాలుగానూ, ఒక్కొక్క భాగం మళ్ళీ రెండు ఖండాలుగానూ విభజింపబడ్డాయి. ప్రతి భాగానికీ, మొత్తం ఉపనిషత్తుకూ కూడా ముండకమని పేరు. ముండక మనే శబ్దానికి వ్యుత్పత్తిలో మంగలికత్తి అనీ, గుండు చేసిన తల కలవాడు-అంటే సన్న్యాసి - అనీ రెండు అర్థాలు. ఉపనిషత్తుకు ఇలా పేరు పెట్టడానికి కారణం ఈరెండు అర్థాల ననుసరించి కొందరు ఇలా చెబుతారు: (1) తలను ఆవరించి ఉన్న జుట్టును మంగలికత్తి నిశ్శేషంగా గొరికివేస్తుంది గదా, అలాగే ఇందులో విస్పష్టంగా సూటిగా ఉపదిష్టమైన పరావిద్య ఆత్మను ఆవరించి వేన్న అజ్ఞానమనే ఆరోపాన్ని ఆ మంగలికత్తిలాగా చక్కగా తీసివేయగలదనీ, (2) అవ్యయమూ, శాశ్వతమూ అయిన పదప్రాప్తికి సన్న్యాసపు ఆవశ్యకతను వక్కాణించడం ద్వారా ఈ ఉపనిషత్తు ముఖ్యంగా సన్న్యాసులకు ఉద్దేశింపబడినదనీని.

## ముండకోపనిషత్తు

### ప్రథమ ముండకము

### ప్రథమ ఖండము

ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।
స బ్రహ్మ విద్యాం సర్వ విద్యా ప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ॥ 1

సృష్టికర్తా, జగద్రక్షకుడూ అయిన బ్రహ్మ దేవత లందరికంటే ముంద పుట్టినాడు. ఆయన సకలశాస్త్రాలకూ ఆధారభూతమైన బ్రహ్మవిద్యను త పెద్ద కుమారుడైన అథర్వునకు అనుగ్రహించాడు.

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మ
థర్వాతాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యామ్।
స భారద్వాజాయ సత్యవాహాయ ప్రాహ
భారద్వాజోఽంగిరసే పరావరమ్॥ 2

బ్రహ్మ అథర్వుణునకు ఉపదేశించిన బ్రహ్మ విద్యను ప్రాచీనకాలంలో అథర్వణుడు అంగిరునికి బోధించాడు. అవిద్యనే భరద్వాజగోత్రుడైన సత్యవాహుడు అంగిరుని వద్ద నేర్చుకున్నాడు. ఇలా పరంపరా ప్రాప్తమైన ఆ పరా విద్యను సత్యవాహుడు అంగిరసునకు అందజేశాడు.

శౌనకో హ వై మహాశాలోఽంగిరసం
విధివదుపసన్నః పప్రచ్ఛ।
కస్మిన్ను భగవో విజ్ఞాతే
సర్వమిదం విజ్ఞాతం భవతీతి॥ 3

శునకఋషి కుమారుడూ ఉత్తమ గృహస్థుడని పేరు పొందిన వాడూ అయిన శౌనకుడు శాస్త్రోక్తరీతిగా అంగిరసమహర్షిని సమీపించివినీతుడై ఇలా అడిగాడు: "భగవన్, దేనిని తెలునుకొవడం చేత గతిశీలమైన ఈ ప్రపంచం అంతా తెలుసుకోబడుతుంది ?"

తస్మై సహోవాచ - ద్వే విద్యే వేదితవ్యే ఇది హస్మయద్।
బ్రహ్మవిదో వదంతి, పరా చైవాపరా చ॥ 4

అంగిరసుడు శౌనకునికి ఇలా బదులు చెప్పాడు: పరా విద్య అపరావిద్యా అని తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయని బ్రహ్మజ్ఞులు చెబుతారు.

తత్రాపరా, ఋగ్వేదో యజుర్వేదః శిక్షాకల్పః
సామవేదో ఽథర్వవేదః శిక్షాకల్పః।
వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి
అథపరా, యయా తదక్షర మధిగమ్యతే॥ 5

ఈ రెండు విద్యలలో నాలుగు వేదాలూ, వేదాంగములైన శిక్షాకల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సూ, జ్యోతిషమూ అన్నీ కూడా అపరా విద్యలే, ఇక శాశ్వతమూ అమరమూ అక్షరమూ అయిన తత్త్వాన్ని అందించే విద్యయే పరావిద్య.

యత్ తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ
మచక్షుః శ్రోత్రం తదపాణిపాదమ్।
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్ భూతయోనిం పరిపశ్యంతొదీరాః॥ 6

కన్నులు మొదలైన జ్ఞానేంద్రియాలకు గోచరం కానిదీ, చేతులు మొదలైన కర్మేంద్రియాలకు దొరకనిదీ, ఉత్పత్తిలేనిదీ, లావు తెలుపు మొదలైన గుణాలు లేనిదీ, కన్నులు చెవులు చేతులు కాళ్లు (వాటిచేత ,చేయవలసిన పని లేక పోవడంచేత ) లేనిదీ, శాశ్వతమైనదీ, అంతటా వ్యాపించినదీ, అద్యంతయూ సూక్ష్మమైనదీ అవధిలేని ఆవిర్భావాలు కలిగినదీ అయిన ఆ అక్షరతత్త్వాన్ని ప్రజ్ఞానులు సకల జగత్తుకూ మూలంగా అంతటా చూడగలరు.

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ
యథా పృథివ్యామోషధయః సంభవంతి।
యథాసతః పురుషాత్ కేశలోమాని
తథాక్షరాత్ సంభవతీహ విశ్వమ్॥ 7

సాలెపురుగు ఎలా తన గూడును తనలోనుండే వెలికి తీసి తనలోకే తీసుకుంటుందో, భూమి నుండి మూలికలన్నీ ఎలా వుద్భవిస్తాయో, మానవుని తల మీద, శరీరం మీద ఏ ప్రయత్నము లేకనే వెంట్రుకలు ఎలా పెరుగుతాయో అలాగే ఆ అక్షరతత్త్వం నుండి ఈ విశ్వం ఉత్పన్నమౌతుంది.

తపసా చీయతే బ్రహ్మ తతో౽ న్నమభిజాయతే।
అన్నాత్ ప్రాణో మనః సత్యంలోకాః కర్మసుచామృతమ్॥ 8

గాఢ తపంలో ఉన్న బ్రహ్మం (సృష్టి చేయాలన్న ఆనందంతో) పెంపొందుతుంది. ఆ బ్రహ్మంనుండి అన్నం పుడుతుంది. ఆ అన్నం నుండి శక్తి, మనస్సు, సత్యమైనవి, లోకములు, ఇక కర్మలలో అంతులేని మెలికలూ కలుగుతాయి.

యః సర్వజ్ఞః సర్వవిద్ యస్య జ్ఞానమయం తపః।
తస్మాదేతద్ బ్రహ్మనామరూప మన్నం చ జాయతే॥ 9

ఆతి ప్రథమ ముండకే ప్రథమః ఖండః

సృష్టికర్తయైన బ్రహ్మ సకల ప్రాణులు వాటి ఆహారమే అన్నీకూడా సర్వజ్ఞుడు, సర్వవిదుడు, జ్ఞానమే తపముగా గలవాడు అయిన పరబ్రహ్మం నుండి ఉద్భవిస్తున్నవి.

**ఇది మొదటి ముండకంలో మొదటి ఖండం.**

# క్లీం బీజసాధన

"క్లీం బీజసాధనలు ప్రతిదినము బ్యాచిల వారిగా. నిరంతర గురు సాన్నిధ్య అనుభూతి సాధనా శిభిరము, 50 వేణుగోపాలనగర్, గుంటూరు నందు కోచింగ్ ఇవ్వటానికి నిర్ణయించి శ్రీ ఆర్.కె. గారు ప్రారంభించినారు. కోచింగ్ పుర్తియిన అనంతరము యీ స్టూడెంట్ మాత్రమే తరువాత జరుగు బోవు కార్యక్రమాల్లో టిచింగ్ పాత్ర వహించటానికి అర్హులవుతారు. ఈ కొచింగ్ లో పాల్గొన్న సాధకులకు మాష్టారుగారిచే ప్రత్యేకమైన ఐడెంటికార్డు జారీ చేయబడుతుంది.

ఈ ఉగాది అనంతరము మాష్టారుగారు వారి ప్రవచనముల లెక్చర్స్ బహుశా, మనకు అందనంత దూరములో, మనము భరించ గలగలేనంతటి విలువలతో కూడి ఉంటుంది. అందరికి ప్రవేశము ఇంక లభ్యముకాదు. ఈ ఐడెంటికార్డు పొందిన వారికి మాత్రమే భవిష్యత్తులో మాష్టారు ఎక్కడ యున్నను అటెండ్ అయ్యే అర్హత సంపాదించుకుంటారు.

గుంటూరు బయటి ప్రదేశముల నుండి వచ్చు సాధకులకు, వేణుగోపాల్ నగర్ యందే వసతి గృహముల ఏర్పాట్లు చేయటం జరిగింది. ఆ వసతికి అనుబంధంగా ప్రత్యేక పద్దతులతో భోజన వసతి గూడ ఏర్పాటు చేయుటం జరిగింది. ఆ ఏర్పాట్లుకు మీరు కొంత రుసుము చెల్లించుకొనే విధానములో నిర్ణయింపబడినది. అధ్యర్వణ వేదములో చెప్పబడిన వేదవిధానముల - గాయత్రి విజ్ఞానములో చెప్పబడిన ఆహరవిధానముల - సంఖ్యాయంత్రములను ఉపయోగించి ఆహారపదార్థములు తయారు చేయబడటం జరుగుతుంది. ఆహార సమయమునందు, అన్నసూక్తము, పృధ్వీసూక్తము, మొ॥ ప్రసారము చేయుట జరుగుతుంది. కార్యక్రమముల వివరములు వెనుక పేజిలో ఇవ్వబడినవి. గుంటూరు బయటి ప్రదేశముల నుంచి వచ్చు సాధకులకు 7 Hours Long time coaching batch or లో పాల్గొన నిర్ణయించబడిన Week day coaching కూడా వారి వారి శ్రద్ధను బట్టి నిర్ణయించుకొని Long time coaching batch వారు వారములో రెండు

రోజులు తప్పక రావలసి యుంటుంది వీలైనంత ఎక్కువ సంఖ్యలో, యీ సాధనలకు హాజరై, మాస్టారు గారి నుంచి Identity Card పొందండి.

ఇక్కడకు వచ్చు సాధకుల List వారములో ఏఏ రోజులలో (Two days) హాజరు అవుతున్నారో వివరములు తెలుపండి.

## కార్యక్రమములు

1. ఉదయం 05-00 గం. నుంచి 06-00 గం.ల వరకు యజ్ఞము.
2. ,, 06-00 గం. ,, 09-30 గం.ల వరకు Short time coaching Ist batch.
3. ,, 10-30 గం. ,, 12-30 గం.ల వరకు 7 hours Long time Coaching Batch ఈ బ్యాచ్ వారికి మాత్రమే మాస్టారుగారి పర్సనల్ పర్యవేక్షణ లభిస్తుంది.
   మధ్యాహ్నం 02-30 గం. ,, 05-30 గం.ల వరకు
   సాయంత్రం 06-30 గం. ,, 08-30 గం.ల వరకు
4. మధ్యాహ్నం 12-30 గం. ,, 01-30 గం.ల వరకు యజ్ఞము
5. సాయంత్రం 06-30 గం. ,, 10-00 గం.ల వరకు Short time coaching II nd batch.

ఈ అవకశము భవిష్యత్తులో మరింక లభించక పోవచ్చు అన్నా గూడా ఆశ్చర్యపడనవసరములేదు.

NB :
1. Short time coaching batch $3^1/_2$ hours with out gap
2. Long time coaching batch 7 hours with gap for Lunch
3. Week days coaching batch 7 days

వీలైతే పై మూడు Coaching batch లో attend కండి. ఎన్ని కొచింగ్ batch లకు ఎటెండ్ అయింతే అంత మంచిది.

